Re_d No. M. 45 / M 3313

౧ ఒక అణా



ప్రతి సోమ, గురు వారములందు వెలువడు జాతీయ పత్రిక

సంపుటము ౧౫ హైద్రాబాదు-దక్కన్ శా. శ. ౧౮౬౨ విక్రమసం॥ పుష్య శు॥ ౮ (౩-౩-౧౩౫౦ ఫ.) సోమవారము సంచిక ౬౭

★ ఇటలీలోకి జర్మనువిమాన దళాలరాక ★

★ కాంగ్రెసు అధ్యక్షుని అరెస్టు ★

# రష్యావారికి యుద్ధభయము

## తమ ప్రజలకు స్టాలిను హెచ్చరిక

### నీస్టరునదిగట్టున రష్యా సేనలుంచుట

డిసంబరు ౩౦వ తేదినుండి జనవరి ౨వ తేదివరకు వచ్చిన గ్రీసు, ఇటలీ యుద్ధసంబంధ వార్తలలో మంచుబాధ మిక్కుటము గానుండుటవల్ల గ్రీకులు ఏదైన క్రొత్త, పెద్ద, ముఖ్యప్రదేశమును పట్టుకొనగలిగినసంగతిలేదు. కాని గ్రీకుసేనలు ముందుకు నడచుచు క్రొత్తగ్రామప్రదేశములను ఆక్రమించుచున్నట్లే వార్తలు గలవు

డిసంబరు ౨౯వ తేదిన మధ్యరంగములో క్లిసూరాకు ఉత్తరమున ఇటాలీయుల క్రొత్త సేనలు వచ్చిపోయిన ప్రదేశములనురాబట్టుకొనుటకై పోరాడినవిగాని, అవి గ్రీకుసేనలచే తరుమగొట్టబడినవి ఆదేరోజు ఇంకనుఉత్తరమున రంగములో ఇట్లేముందుకుదూకిన ఇటాలీయ సేనలు వెనుకకు తరుమగొట్టబడినవి ౩౦వ తేది నాటిక పోగ్రాడెట్జు కుపడమటి ఇటాలీయ దుర్గములన్నియు గ్రీసులకు వశమయ్యెను. మొత్తము వేయిమంది ఇటాలీయ సైనికులు గ్రీకులకు ఖైదీలుగ చిక్కవలసివచ్చెను డిసంబరు ౩౧వ తేదినాటికి ఇటాలీయులు లిబా ప్రాంతములో యుద్ధసామగ్రిని అప్పుడే ఎల్బాసన్‌వైపు పంపించివేయుచుండిరి జనవరి౧వ తేది నాటికి ఇటాలీయులు టిపెలిని, క్లిసూరా, వాలోనా తమకుదక్కవను భయంతో అల్బేనియా మధ్య భాగంలో వాలోనాకు ఉత్తరమునుండి ప్రారంభమై టోమార్ కొండలమీదుగా, ఎల్బాసనుకుతూర్పునకును, అక్కడినుండి యుగోస్లావు పరిహద్దువరకు ఉత్తరమునకును, క్రొత్తదుర్గములను స్థాపించుకొనుచుండినట్లు తెలిసినది డిసంబరు ౩౦వ తేదిన ఇటాలీయసేనలు షిమారాకుఉత్తరమునను, ఈశాన్యమునను గ్రీకుసేనల నెదిరించగా గ్రీకుసేనలు వాటిని తరిమివేసినవి డిసంబరు౩౧వ తేది గ్రీకుసేనలు అర్ధరాత్రివేళ క్లిసూరారంగంలో ఇటాలీయసేనలపై గొప్పపోరాటము ప్రారంభించిరి మొత్తముమీదజనవరి౧వ తేదినాటికి గ్రీకుసేనలు క్లిసూరానుండి వాలోనాకుపోవురోడ్డుపైకి ఫిరంగులు ప్రేల్చగలిగినంతదూరమునకు చేరిరి జనవరి౨వ తేదినాటికి గ్రీకులు క్లిసూరాప్రాంతంలో అనేకస్థలాలను పట్టుకొనగలిగిరి ట్రీస్టినుండి యుగోస్లావియాలోని గుల్బియా నాకుపోవుబాటపైనుండే పాశ్చుమియా పట్టణములో ఇటాలీయ సేనాస్థలములకు నిప్పంటించబడినట్లు జనవరి౨వ తేది వాటి వార్తయొకటి తెల్పుచున్నది ఈపని ఎవరోఅక్కడి ప్రజలలోనివారే చేసియుందురనుఅనుమానంచే నల్గురు సామాన్యజనులు అరెస్టుచేయబడినారట జనవరి౧వ తేది పోరాటములు లేవు

ఉత్తరరంగంలో గ్రీకుసేనలు మూడు శాఖలుగానడచుచున్నవి. ఒకటి కొరిట్జానుండి మొస్కొపోలిస్‌గుండా బేరాటుకు పోవుచున్నది రెండవది స్కంబిాడిఎగువభాగపుప్రాంతమునుండియు, మొస్కొనుండియు మోక్రా కొండల ప్రాంతమునుండియు షైలీస్ గుండా ఎల్బాసన్ ప్రాంతములకునడచుచున్నది. మూడవది పోగ్రాడెట్జు, లిన్ పట్టణాలనుండి ఎల్బాసనువైపే పోవుచున్నది

ఇక విమానాల దాడులసంగతి బ్రిటిషువిమానాలు డిసంబరు౨౯వ తేదిన వాలోనపై రెండుమార్లుదాడిచేసి అక్కడిఇటాలీయసేనలపై బాంబులువేసెను రెండు ఇటాలీయ సామగ్రి ఓడలపైనను, ఒకఇటాలీ క్రూయిజరు నౌకపైనను మరతుపాకుప్రేల్చెను ఈదాడిలో ఒక బ్రిటిషువిమానము నష్టమయ్యెను. ఇద్దరువైమానికులు పారచూటులతో క్రిందికిదిగుచు వినష్టులైరి డిసంబరు ౩౦వ తేది ఇటాలీయవిమానాలు గ్రీకుసాలోనికా, జానినా, కోరాని అనుచోట్లపై బాంబులువేసినవి ఒకఇటాలీయవిమానము క్రిందకూల్చబడినది. నవంబరు౨౮వ తేదినుండి డిసంబరు౨౧వ తేదివరకు ఇటాలీయవిమానాలదాడులచే ౧౦౭ మంది గ్రీసుప్రజలుచచ్చిరి, ౨౮౬మంది గాయపడిరి-అని గ్రీసు ప్రభుత్వమువారు ప్రకటించినారు

### ఆఫ్రికాలో బ్రిటనుఇటలీలయుద్ధము

ఆఫ్రికాలో పడమటిఎడారిలో బార్డియాను ముట్టడివేసి అందలిఇటాలీయసేనలను లొంగదీయుటకై బ్రిటిషుసేనలు ఇంకనుఏర్పాట్లుచేసికొనుచున్నవి ఈఏర్పాట్లుచాలవరకు పూర్తియైనవి, బ్రిటిషుసేనలు ఇటాలీయులమీద ఫిరంగులు ఎంతఎక్కువగా ప్రయోగించుచున్నవో ఇటాలీయసేనలు బ్రిటిషువారిపై అంతఎక్కువగా కొకున్నను, కొంచెముమంచిదెబ్బతగులునట్లయినను ఫిరంగులు ప్రయోగించుటలేదు అందువల్ల బ్రిటిషుసేనల సన్నాహములు నిరాటంకముగా సాగుచున్నవి

సూడాను, కెన్యాప్రాంతములలో బ్రిటిషుపహరాసేనలు ప్రతిరోజును ఇటాలీయసేనలపైకిపోయిఎదిరించి, నష్టపరచి చిక్కినసైనికులను పట్టుకొనివచ్చుచున్నవి

ఇక బ్రిటిషువిమానాలు ఇటాలీయసేనల సామగ్రికి నష్టముకలిగించుటకై చాలచురుకుగాదాడిసాగించుచున్నవి డిసంబరు ౨౯వ తేదిన రాత్రి బ్రిటిషువిమానములు గాజాలా, టోబ్రుకులలో ఇటాలీయవిమానాలు భూమిపై దిగుచోట్లపై బాంబులనువేసినవి దక్షిణ ఆఫ్రికాప్రభుత్వమువారివిమానదళాలు ౩౦వ తేదిన సోమాలీలాండులో బార్బర్గాలో విమానాశ్రయముపై బాంబులువేయగా, క్రిందవుండేఇటాలీయుల విమానమొకటి పూర్తిగానాశమయ్యెను, మరికొన్ని చాలయెక్కువగాపాడయ్యెను డిసంబరు ౩౦, ౩౧ వతేదులలో టూరాంటోలోను, నేపిల్సులోను ఇటలీవారినౌకలపై బ్రిటిషువిమానాలు బాంబులనువేసెను పాలెర్మోఓడరేవుమీదను క్రోటోనులోఒక రసాయనపదార్థాల కార్ఖానామీదనుకూడ ఈరోజులలో బ్రిటిషువిమానాలు బాంబులువేసినవి. డిసంబరు ౩౧వ తేదినట్రోరే అను స్థిమూటామీదను, వాలోనామీదను బాంబులువేయబడినవి అందుచేఇటాలీయులకు చాలనష్టముకలిగినది ఈదాడిలో బ్రిటిషువిమానాలనెదిరించుటకు వచ్చిన ఇటాలీయవిమానాలలోనుండి ఒకటిదెబ్బలకు గురియైనందున పాడయ్యెను, బ్రిటిషువారివిమానమొకటి స్వస్థానానికిచేరుకొనలేకపోయెను ఇదే ౩౧వ తేదిన బార్డియాలోను, బార్డియాకుపడమటనుఉండు ఇటాలీయసేనలపైనను మోటారుకారులపైనను సైనికసామగ్రిపైనను బ్రిటిషువిమానాలు బాంబులనువేసినవి గాంబటుపై దెబ్బచే అక్కడక్రిందనుండిన ఒకవిమానముమాడిపోయెను తూర్పుఆఫ్రికాలో గుబ్బాయందు ఇటాలీయవిమానాలపైనుండిక్రిందికిదిగేచోటుపైనను అస్మాబులో సైనికసామగ్రిమీదను డంఫీలాలో సేనలు విడిసియున్నచోటిమీదను బ్రిటిషువిమానాలు బాంబులు వేసినవి జనవరి ౧వ తేదిన బ్రిటిషువిమానాలు ఇటలీవారిబార్డియా, డెర్నాలమీదను, ట్మిమిలోని విమానాశ్రయాలమీదను బాంబులనువేసినవి ఇటలీవారి తూర్పుఆఫ్రికాలో రొడిషియావిమానదళము సద్దెరాత్‌లో భవనాలపై బాంబులనువేసెను, కెరులో శత్రుస్థానాలమీదకూడ ఇదేవిమానదళము బాంబులవేసెను అక్కడఒక మోటారుశకటములదళమునకు మంటలంటుకొని పాడయ్యెను

బ్రిటిషువారిస్థానాలపై ఇటలీవిమానాలదాడులుకూడ ఉత్సాహవంతములుగాలేవు ఈనాలుగురోజులకు గాను, జనవరి ౩౦ వ తేదిన మాల్టాపై బాంబులువేసి ఇద్దరుబిడ్డలకు చిన్నగాయములు కలిగించినదనుమాత్రమే ఇటాలీయవిమానములకు దక్కినట్లు బ్రిటిషువారి ప్రకటనలలోనున్నది,

మొత్తముమీద డిసంబరు ఆఖరు తేదినాటికి అంతముగు ౨౧ రోజులలో బ్రిటిషువారిదాడులచే ఇటలీవారివి ౨౦౦ లకుపైగా విమానములు క్రిందికి కూల్చి వేయబడినమాట నమ్మకమైయుండ, బ్రిటిషువారివి ౨౦విమానములు మాత్రమేవారిచే నాశముచేయబడినవి

ఇక సముద్రంలో ఇటాలీయనౌకలగతిమాత్రము, ఏడ్రియాటికుసముద్రంలో డిసంబరు ౩౧వ తేది ఉదయము ఒకబ్రిటిషుయుద్ధనౌకతుపాకులను, మోటారులారీలను గొనిపోవుచుండిన నాలుగుఇటాలీయ నౌకలను అల్బేనియా, యుగోస్లావుదేశముల సరిహద్దులకలియుచోటికి ఎదురుగాకొంతదూరంలో ముంచివేసినది.

మొత్తముమీదగతరెం వసంవత్సరములో లెక్కలు తేల్చబడినవి ఈకాలంలో బ్రిటిషువారి దెబ్బవల్ల ఇటలీవారివి ఒకక్రూయిజరు ౧౧డిస్ట్రాయరులు, ౨౫ జలాంతర్గాములులేకుండాపోయినవి ౩ యుద్ధనౌకలు రెండుక్రూయిజర్లు, రెండు సహాయనౌకలు చాలాపాడైనవి ఒకయుద్ధనౌక నాలుగుక్రూయిజర్లు రెండు డిస్ట్రాయరులుకూడ పాడైనవి ఇదేసంవత్సరంలో డిసంబరు ౨౮వ తేదివరకు ౭౧౬ ఇటాలీయవిమానాలు నమ్మకంగా బ్రిటిషువారిదెబ్బలచే నష్టమైనవి. ఇటలీవారినుండి బ్రిటిషువారికి ౭౫ విమానాలుమాత్రమేనష్టమైనవి

౧౦వ పేజి చూడుడు



## ఆయుర్వేదకళ

యీమాసపత్రిక ప్రతియింగ్లీషునెల మొదటివారమున ప్రచురింపబడును. ఇందుయెల్లరకు తెలియునట్లు ఆరోగ్యవిషయములను శాస్త్రీయముగా ప్రచురింపబడును.

సంవత్సరచందా రు. 3-0-0

సంపాదకులు: పండిట్ రామానుజస్వామి
౧౭౦ సుల్తాన్‌బజారు, హైదరాబాదు-దక్కన్

# అడవిమృగాలు పాలంపనిచేయుట

## రష్యాశాస్త్రజ్ఞుడు జంతువులకిచ్చిన అద్భుతశిక్షణ

ఎలుకలూ, పందులూ, నక్కలూ యింటిపనులూ పొలంపనులు చేస్తాయంటే మీరువిశ్వసిస్తారా? కప్పలుకడగడం కూరలుకోయడం మొదలయినపనులు జంతువులచెయ్యడ మేమిటని ఆశ్చర్యంగాఅంటారుకూడాను.

కాని యిదినిజం రష్యాలోని ప్రొఫెసర్ వ్లాడిమర్ దురోవ్ అనేశాస్త్రజ్ఞుడు రెండుసంవత్సరాలక్రితం తనయింటిపనులన్నీ జంతువులే చేసేటట్లు తరబీతునిచ్చానని చెప్పాడు,

ఒకనాడు దురోవ్ తనపాదాలదగ్గరతోకలనాడిస్తున్న రెండుకుక్కలవైపూ దృష్టిసారించాడు వాటినిచూసి "షదుగో రేపణ్ణుంచి, నాకుభోజనంతీసుక రావలసినబాధ్యతమీదే నారక్షణకూడా వహించవలసిందిమీరేఅన్నాడు,

బోనులోనుంచి రెండునక్కలనువదలి "రేపణ్ణుంచి నాతోటలోకూరలు కాచేమొక్కలను చక్కగాఉండేటట్లు మీరేచెయ్యాలి"అన్నాడు

అనక్కలు కుక్కలనుచూచి భయపడలేదు కుక్కలు బొంయిమని మొరగాలేదు.

మాస్కోనగరం వెలుపల ఒకపొలంఏర్పాటుచేశాడు. అపొలంలో వ్యవసాయపుపనిఅంతాజంతువులేచెయ్యాలనే పట్టుదలతో నాటికిఎంతోశ్రమపడి తరబీతునిచ్చాడు. ఒకఎలుగుగొడ్డలితో కలుపుతవ్వేది. పందులు నేలనువాసనచూసి, బంగాళాదుంపలుత్రవ్వుతుంటే రెండుబీవర్లు వాటినిఒకచోటచేర్చేవి,

ఇంటిని రాకూన్ అనేజంతువు తనకుచ్చుతంటితోకతో శుభ్రపరుస్తుండేది. రాబిట్లుకూడాగదులన్నీచక్కగాశుభ్రపరిచేవి.

ఈవిశేషాలు విన్నవారందరూ ఏర్లతరబడిని. తరబీతుచేసినా విభిన్నప్రకృతులుగల వన్యమృగాలకు సఖ్యతకలిగించడం విరుద్ధవిషయమనీదురోవు ఏయోగశక్తిమూలానో యిదంతా చెయ్యగలుగుచున్నాడనీఅన్నారు. కొందరుహేళన మొదలుపెట్టారు.

రష్యాప్రభుత్వం దేశఖ్యాతికే మచ్చరానున్నదని భయపడి, యీపరిశోధనలు అపుచెయ్యవలసిందని దురోవుకాజ్ఞాపించింది.

కాని విధివశాన అతడుపెంచినజంతువులవల్లనే అతనికి ముప్పుకలిగింది, మాంసజంతువులు మినహా అన్నింటినీ దురోవువదిలివేశాడు అవిఒకఎలుగూ, మూడుఎలుకలూను, అతనిజోళ్ళకురంగువేసి పాలిషుచెయ్యడంనుంచి ఎలెక్ట్రిక్ దీపాలు స్విచ్ వేసి వెలిగించడంవరకూ అన్నీఅవే చేసేవి. ప్రతిరోజూ దురోవు వాటికి క్రొత్తక్రొత్తవింతపనులుచెప్పి చేయించేవాడు ఒకనాడుఅతని మెషీ(ఎలుగు)కోపంవచ్చి యజమానిపయిన తిరగబడి, పంజాతో కొట్టింది. అతడప్పటికి ఓపికలేనివృద్ధుడుకావడంవల్ల ఆదెబ్బకు తాళలేకపోయాడు.

గతసంవత్సరం డిసెంబరులో దురోవు మరణించాడు అయినాను పెంపుడుజంతువులు కూడా తమయజమానికి నమస్కారంచేశాయి. అతనిశవంమీదికెగబ్రాకి, మెల్లగాఅతని పెదవులను ముద్దుపెట్టుకొన్నాయి,

(ప్రజాబంధు)

---

# డక్కన్ అస్యూరెన్సు కంపెనీ

# లిమిటెడ్, బెజవాడ

ఆకర్షణీయమైన నవీన భీమాపద్ధతులు. పెట్టుబడిసొమ్మునకుగాను భద్రతయున్నూ, పట్టాదార్లకు హామీయున్నూ, క్లయిములు, శీఘ్రముగా పరిష్కరించుటయున్నగు ప్రత్యేకసౌకర్యములు గలవు.

మీజీవితమును యిదివరలో భీమాచేసికొని యున్నారా? లేనిచో నేడే భీమా చేసికొనుడు. ఆలసించినచో మీజీవితము భీమాచేసికొనుటకు అర్హత లేకపోవచ్చును.

**కావలెను:**—ఆంధ్ర మరియు నైజామురాష్ట్రములందన్ని జిల్లాలలోనున్నూ ఏజంట్లు కావలసియున్నారు. మంచిపలుకుబడి, సమర్థతగలవారికి ప్రోత్సాహకరమునూ శాశ్వతమునగునట్టి షరతులపైన ఏజన్సీ ఇవ్వబడును.

పూర్తి వివరములకుగాను ఈదిగువ నుదహరించిన అడ్రసుకు వ్రాసినచో బడయుగలరు.

| | |
|---|---|
| డక్కన్ అస్యూరెన్సు కంపెనీలిమిటెడ్ | వి. రామప్పరెడ్డి, దేశముఖు |
| హెడ్ ఆఫీసు | ఏజంటు, డక్కన్ అష్యూరెన్సుకం. లి. (నైజాము రాష్ట్రమునకు) |
| బెజవాడ | మునగాల రాజాగారి బంగళా, ఫతేసుల్తాన్ లేను నేషనల్ రోడ్డు హైద్రాబాదు-దక్కన్ |

---

# హిట్లరు మనస్సులో ఉండే ముందటి యెత్తు

## బ్రిటనుపై దాడిని తీవ్రముచేయవచ్చును

నెర్నాబార్ట్‌లెట్ గారు ఈ ఊహకు కారణాలు వివరించుట

బ్రిటనులో "న్యూస్‌క్రానికల్" అనే పత్రికలో వెర్నాన్ బార్ట్‌లెట్ అనేఆయన హిట్లరు సేనలు ఇటలీలో కనపడుచున్నవి, రుమేనియాలో కనపడుచున్నవి, కాబట్టి హిట్లరు బాల్కను రాజ్యాలమీదికి దండెత్తేయెత్తుమీద ఉన్నాడు—అనేవారల వాదము ఖండించుచు. హిట్లరుఇప్పుడు బ్రిటనుమీద దాడిని తీవ్రముచేయవలసినదే గాని తూర్పువైపు దండయాత్రకు పోడని చెప్పుచున్నాడు దానికి ఆయిదారుకారణాలు నిదర్శనంగా చూపినారు.

మొదటిది ఈ చలికాలంలో బాల్కను రాజ్యాలపైకి సేనలనుపంపించడంఅంటే ఎంతో ఖర్చు, కష్టములతోఅయ్యేపని. అందులోను ఇప్పుడు బాల్కనుప్రాంతపురాజ్యాలు తమవర్గంలోచేరిన గ్రీసురాజ్యంవారు జర్మనీ మిత్రమైన ఇటలీ రాజ్యపుసేనలను ఓడించుచుండుటచూచి జర్మనీసేనలువచ్చి నాఎదురు తిరిగేదానికి ఉత్సాహంపొందిఉంటారు. రుమేనియారాజ్యము పూర్తిగా నాజీలక్రిందఉన్నా: అక్కడి ఐరన్‌గార్డులు నాజీపక్షలక్షణాలు గలవారేఅయినా, అఐరన్‌గార్డులలోనే చాలామంది జర్మనీ ఇటలీలు చేరి రుమేనియాకుండవలసిన ట్రాన్సిల్వేనియాలో ఎక్కువభాగం హంగరీకెందుకిప్పించవలెనని ఆగ్రహంచెందిఉన్నారు. రుమేనియాపైనాజీలు ఇప్పటికంటె ఎక్కువఅధికారం చెలాయించ మొదలుపెట్టునప్పటికి ఈఆగ్రహం తప్పకుండా వృద్ధియై రుమేనియా జాతీయభావము జర్మనీకిప్రతికూలముగ విజృంభించగలదు.

రెండవసంగతి. మధ్యధరా సముద్రంలో అధికారంగలిగిఉండడానికి ఇటలీ సహాయపడుతుందిగదాఅనిహిట్లరు అంచింతండిఉంటే ఇప్పుడు గ్రీసుపై దాడిలో ఇటలీ దెబ్బలుతినుచుండుటవల్ల అనిశ్చయపడలుకోవలసిఉంటుంది. ఇప్పుడు ఫ్రెంచివారినిబుజ్జగించి వారినౌకలను తమఅధికారం క్రిందికి తెచ్చుకోగలిగితే హిట్లరు మధ్యధరా సముద్రంలో జర్మనీబలాన్నిస్థాపించేలాగ పెట్టుకోవచ్చును. అయితే ఫ్రాన్సునుండి ఓడలు సంపాదించుకోవలెనంటే హిట్లరు బ్రిటనుపై దెబ్బతీసి, మూడునాల్గుప్రతాపముఅనే బెదరు ఫ్రెంచివారికి కలిగించవలసిఉంటుంది. అందువల్ల ముసోలినీకి గ్రీసుపై దాడితోడ్పడడానికి సేనలుపంపించడంకంటె బ్రిటనుపైదెబ్బతీయుటయే హిట్లరుకు ఎక్కువముఖ్యము. అట్లుచేసిప్రతాపంచూపించగలిగితే ఇప్పుడు ఫ్రాన్సులో నానాటికి వృద్ధిపొందుతూఉండే బ్రిటనువైపు పక్షపాతమును తగ్గించగలనని హిట్లరు ఆశించుకోవచ్చును.

ఇంకొకముఖ్య విషయమేమనగా, ఇప్పుడు ముసోలినికి సహాయంపంపిస్తే గ్రీసుసంగరంలో ముసోలినీ గెలుస్తాడో గెలవడో! ఓడితే హిట్లరుకు అప్రతిష్ఠ కాబట్టి బ్రిటనుమీద హిట్లరు దెబ్బతీసి తనప్రతాపాన్నిచూపిస్తే తనప్రతిష్ఠనిలవడమే కాకుండా ఆఖరుకు ముసోలినికికూడా సహాయపడగలస్థితి తనకువచ్చును.

ఇంకొకసంగతి ముసోలిని గ్రీసుతో గెలుస్తాడో గెలువడోఅనే సందేహం వచ్చినస్థితిలో ముసోలిసహాయానికై సేనలనుపంపి, ముసోలిని ఓడితే అప్పుడు ఒకదురదృష్టం ఏమంటే అమెరికాలో వారు ఉత్సాహంచెంది యుద్ధసామగ్రిని ఎక్కువగా ఉత్పత్తిచేసి బ్రిటనుపక్షాన్ని బలపరచి తుదకు జర్మనీనే లొంగదీయవచ్చును. కాబట్టి మొదటనే బ్రిటను తలయెత్తకుండా అణచివేస్తున్నట్లయితే అమెరికావారు అదిచూచి బెదరి బ్రిటనుకు సహాయంచేయకుండా ఉంటారని తలచవచ్చును.

ఈకారణాలన్నిటివల్ల హిట్లరు ఇకముందు బ్రిటనుయొక్క నౌకాబలమును, పార్శ్రామికబలమును విచ్ఛిన్నముచేయుటకై బ్రిటనుపై తనదాడిని తీవ్రముచేయవచ్చునని బార్ట్‌లెట్ గారి ఊహ.

---

## న్యాయశాఖ నివేదిక

### ౧౩౪౯ ఫ.

హైదరాబాదు (దక్కన్). బహిమన్ ౨౦ ము.ఘు.వ. నిజాం ప్రభుత్వ న్యాయశాఖవారి పనులనుగూర్చిన ౧౩౪౯ఫ నివేదిక ప్రకటితమైనది. అందులో ఖాల్సాలో దివానీ, ఫౌజ్దారీ, వివిధములుఅయిన క్రొత్త అభియోగముల మొత్తము ౧౩౬౫౩. ఇదివరలోనే నెంబరుమీదికివచ్చి బకాయక్రింద ఉన్న అభియోగాల మొత్తము ౪౦౪౪౯. ఇట్లుఏర్పడిన ౨౦౯౬౨ అభియోగాలనుండి ౧౩౫౪౩ అభియోగాలు పరిష్కారముచేసివేయబడినవి. ఈసంఖ్య ౧౩౪౮ఫ.లో పరిష్కారముచేసిన అభియోగాల సంఖ్యకంటె ౮౭౯ తక్కువ

ఖాల్సా న్యాయస్థానాలయందు ౧౩౪౮ఫ.లో సరాసరిన దివానీఅభియోగముల పరిష్కారానికి ౧౨౨ రోజులు పట్టియుండెనుగదా, ౧౩౪౯ఫ.లో ౧౦౫రోజులే పట్టినవి. ఇదేవిధంగా ఉన్నతన్యాయస్థానంలో దివానిఅభియోగాల సంబంధమునైన మురాఫాలలో సరాసరిన ౧౩౪౮ఫ.లో ౪౧౯రోజులనుండి ౧౩౪౯ఫ.లో ౩౭౮రోజులకు తగ్గెను. డివిజనల్ న్యాయస్థానాలలో ౧౯రోజులును, జిల్లా న్యాయస్థానాలలో ౩రోజులునుతగ్గెను. ౧౩౪౯ఫ.లో తెచ్చిన అభియోగాలసంఖ్యతగ్గుటచే ఖాల్సా న్యాయస్థానాలలో ఈ సంవత్సరమందు రూ౯౩౯౪౬౦ దివాని అభియోగాలమాత్రమే వచ్చియుండెను

ఫౌజ్దారీ అభియోగాలు

ఫౌజ్దారీఅభియోగాలలో ౧౩౪౮ఫ.లో సరాసరి ౨౭రోజులలో అవుతుండే పరిష్కారము ౧౩౪౯ఫ.లో ౨౦రోజులలోనేఅయినది. ఈఫౌజ్దారీ మురాఫాలలో ఉన్నత న్యాయస్థానంలోకి వచ్చిన అభియోగాలలో ౧౩౪౮ఫ. లో ప్రతిశతి ౯౦వంతున పరిష్కారమైయుండగా ౧౩౪౯ఫలో ౯౩వంతున మాత్రమే పరిష్కారమయ్యెను. సెషన్సు, మరియు జిల్లాన్యాయస్థానాలలో వరుసగా ప్రతిశతి ౧౯లెక్కనను, ప్రతిశతి ౨లెక్కనను పరిష్కారకాలము తగ్గెను.

జాగీరు, పాయెగా న్యాయస్థానాలలో నెంబరుమీదికి తీసికొన్న అభియోగాలవిచారణకాలము హెచ్చెను కాని, ఫౌజ్దారీ అభియోగాల విచారణకాలము తగ్గినది.

౧౩౪౯ ఫ.లో న్యాయస్థానాలలో ప్రవేశపెట్టబడిన అభియోగాలసంఖ్య తగ్గుటవల్ల న్యాయశాఖవారి ఆదాయము రూ. ౧౯౩౪౨౪౯లు (౧౩౪౮ఫ.లో) నుండి రూ౧౫౪౯౦౫౨లకుతగ్గినది.

---

# చెవుడు

"చెవుడు పోగొట్టునది" చెవుడుగాని, చెవికి సంబంధించిన మరియేజబ్బయినగాని పోగొట్టునట్టి ఒకగొప్పఅద్భుతమైన క్రొత్తమందు. ఎంతకాలమునుండిఉన్న చెవుడైనను, నిస్సంశయముగా పోవును. చెవిటివారు సచ్ఛముగా విందురు. చెవుడుకొంచమైనను, ఎక్కువగానున్నను, పూర్తి చెవుడైనను. తీరనిచెవుడైనను, జ్వరమువలనగాని నరముల బలహీనతవలనగాని, గొంతునసవలనగాని, ముక్కు మరియే ఇతర అవయవములవల్లగాని కలిగినచెవుడైనను అనుమానము లేకుండ మానును; చీముకారుటకూడ ఆగును. మరియు వినికిడిశక్తి శాశ్వతముగనుండును. ఈఔషధముచే వేనకువేలు చెవిటివారు బాగుగా వినగల్గుచున్నారు, ధర రు. ౭ పోస్టేజి అ. 9.

ఏజంట్లు.—సయ్యద్ అబ్దుల్ రజాక్ అండుకో-ము.ఘు.వ. నిజాం కెమిస్టులు. చార్‌కమాన్—హైదరాబాదు (దక్కన్).

A products of MAHAMPS REMEDIES LTD. P.O. Box954, Bombay

---

# మేకుకొట్టినట్లు బాధలు

మీకు శరీరమునందెచ్చటనైన బాధయున్నదా? ఒక నరముమాత్రమేనా లేక దేహమంతయునా? అనవసరముగా ఎందుకు బాధపడెదరు? వాపులు, బాధలు, తీపుపోటు, కాళ్లనొప్పులు, తలనొప్పి, చెవినొప్పి, పండ్లనొప్పి మొదలైన కండరముల బాధలన్నియు వి క్సు ల్సు ఓ రి య ం ట ల్ బా ం ఉపయోగించిన తోడనే మాయమై స్వస్థత చేకూరును. 50 సంవత్సరముల నుండి నొప్పులకు బాధలకు అమూల్య ఔషధమని ఘనతగాంచినది. వేలకొలదిమందికి బాధా నివారణమైనది. మీరెందుకు వ్రాయరు? ఈరోజే వ్రయత్నించండి. అంతటాఅమ్మబడుతుంది.

లిటిల్సు

ఓరియంటల్ బాం

---

## అందరూ ఈరోజునుండే పుచ్చుకొనుట ప్రారంభించండి.

ట్రేడ్ మార్కు

# జాండు

## ద్రాక్షాసవ

దేహమునకు మెదడునకు ఉత్సాహమును గలిగించు రుచ్యమైన ఔషధము.

జాండు ఫార్మసూటికల్ వర్క్సు లిమిటెడ్—బొంబాయి

నిజాం ఏజంట్లు:

మెసర్సు, డి. జె. పారేఖ్ అండుకో—శికింద్రాబాదు.

---

# మీకు కావలెనా?

వెల స్వల్పము — బలము అధికము

ఆయిల్ ఇంజనులు
రైసుమిల్లులు
హాల్లర్సు
పిండిగిర్నీలు
గానుగలు
ఎలక్ట్రిక్ మోటార్సు
పంపింగులు
బేరింగులు
పుల్లీలు
పైపు ఫిట్టింగులు
క్రషింగు సెట్టులు
స్ప్రేయింగు సెట్టులు

మరియును కా అన్నిరకముల యంత్ర సామానులకు ఈక్రింది వారిని సంప్రదించండి.

# హెచ్. యస్. వాసన్

బాట్లిబాయి అండు కో, బొంబాయివారి ఏజంటు.

కింగ్సువే ... ... ... ... శికింద్రాబాదు-దక్కన్

క్రొత్తగాగిర్నీలు వగైరా ఏర్పాటుచేయువారికి సలహా ఉచితముగా యివ్వబడును

## గోపాలపేట సంస్థానము

### గ్రామ పునరుద్ధరణ కార్యాలు

శ్రీమతి రాణీ లలితాదేవి గారు గోపాలపేటసంస్థానమునందు (జిల్లా మహబూబునగరము) నిర్వర్తించుచున్న గ్రామపునరుద్ధరణకార్యము కొలదికాలములోనే మంచిఫలితముల నొసంగగలదని సంతోషము కలిగించుచున్నది.

**వడకుట మరియు నేయుట**

సంవత్సరములో కొంతకాలమువరకు నిరుద్యోగము చేపీడింపబడు జనులకై ఒకవృత్తిని కలిగించుటకుగాను శ్రీమతి రాణీ లలితాదేవి గారు రాట్నములను ప్రజలకు ఉచితముగాయిచ్చినారు. ప్రప్రథమమున ౩౫రాట్నములు జాతిమతవివక్షణలేకుండ బీదకుటుంబీకులకు (తురుష్కులు, హీనజాతివారలు, మరియుయితరహిందువులు) యివ్వబడెను. వడకనేర్చినవాండ్లకొరకు నేతపనినేర్పించుటకుగాను ఒకక్లాసుకూడ తెరవబడినది.

**ప్రాథమికవిద్య, వయోజనవిద్య**

రెండు రాత్రిపాఠశాలలు- ఒకటి ప్రాథమిక విద్యకుగాను, రెండవది వయోజనవిద్యకుగాను స్థాపింపబడినవి తెలుగు అచ్చటి వాడుకభాషయైనందున ఈపాఠశాలలయందు తెలుగే చెప్పబడుచున్నది ప్రపంచజ్ఞానమును బోధించు పాఠములు మరియు ప్రకృతికసంబంధించినపాఠములు కూడ చెప్పబడుచున్నవి. పాఠశాలలో దినహాజరి రమారమి ౫౦కంటె తక్కువలేదు. మ్యాజిక్ లాంతరు లెక్చర్లు, రేడియోసంభాషణలు తరచుగా జరుపబడుచున్నవి. ఇట్టిప్రదర్శనములసమయమున రమారమి ౨౦౦కంటెఅధికముగ జనులు వచ్చుచున్నారు.

**ఆరోగ్యరక్షణ, గృహకృత్యనిర్వాహక విషయములు**

మద్యపాననిరోధమును గురించి అప్పుడప్పుడు తెలుగునందు ఉపన్యాసము లివ్వబడుచున్నవి. మరియు ప్రజలు వీటిననుసరించి నడచుకొనునట్లు చేయుటకుగాను రెండుతెగనిప్రయత్నములు కూడ జరుగుచున్నవి.

ప్రజలయందు నారోగ్యము కలుగకుండ చూచుటకుగాను ఒక సుశిక్షితురాలైన నర్సుకూడ నియమింపబడినది. ఆమె వీలైనంతవరకు ప్రసవసంబంధమైన విషయము లయందు శ్రద్ధతీసుకొనుచున్నది. ఆమె అస్పత్రిలో పనిచేయుచు గ్రామస్థుల ఆరోగ్యమునకు గావలసిన ఉపచర్యలకొరకైకూడ పాటుబడుచున్నది. అస్పత్రికితిరిగి భవనముకూడ కట్టబడుచున్నది.

గత హైదరాబాద్ స్త్రీల కాంఫ్రెన్సునందు శ్రీమతి రాణీలలితాదేవిగారు ఈవిషయమును గురించియే తీర్మానమును కదల్చినారు. వారు దీనియందు యెక్కువ అభిరుచిని చూపుచున్నారు. నేను వీరికార్యమునందు సంపూర్ణజయముకొరకై ప్రార్థించుచు, ఇతరజాగీరుదార్లుకూడ తమతమ జాగీర్లయందు యిట్టిసమస్యకై పాటుబడెదరని నమ్ముచున్నాను.

---

## హుజూరునగరము

### మతశాఖమంత్రిగారి రాక

(ఒకవిలేఖరి) ౨౫-౩-౫౦ ఫ.

౨౫-౩-౫౦ ఫ నాడుపగలు ఒంటిగంటకు మతశాఖమంత్రి అజీజ్ గారు మాగ్రామమునకు దయచేసిరి. స్థానికాధికారులు వారికి బ్రహ్మాండమైన స్వాగతమొసగిరి.

**శీతానగరంఅగ్రహారము**

శీతానగరంఅగ్రహారము పూర్వపుజమీందార్ల కాలంలో హుజూరునగరములోచేరియున్న మజర.జమీందారులసమయమున ఫణిగిరిరామస్వామి దేవళము నిత్యనైవేద్య ఉత్సవాదులనిమిత్తము అగ్రహారము గాఅమలుచేసినారు. ప్రతిఏట కార్తీక శు ౧౫లు కల్యాణఉత్సవముజరుగుచు నేయుండెను. కాని ఇపుడు దేవునిఉత్సవాదులు సరిగా జరుగకున్నవి, ఇదియునుగాక అగ్రహరము అరణ్యప్రాంతములోగాన అనాదినుంచి ఒకతటాకముండెను. తటాకమును తీసివేసి వ్యవసాయము చేయించుటకలన నీటికొరకు అవస్థగానున్నది.

**దేవాలయపుకమిటీ.**

౧౩౪౮ ఫ లో అదేవాలయపుకమిటీని తహసీల్ద్వారా రద్దుచేయించియున్నారు. తిరిగికమిటీని పూర్వపకారము ఏర్పాటుచేయుటకై (౫౦)సంతకములతో ఒకవిజ్ఞప్తిని మతశాఖమంత్రిగారికి రైతులుసాహుకారులు మొదలగువారలుసమర్పించుకొనిరి శ్రీవారుదానినిపరిశీలించి జిల్లాకార్యాలయు విచారణానంతరంఏరీతిగాతీర్పు కాగలదో అదేరీతిగా అమలుపరచెదమనిచెప్పిరి.

## ఆరూరు (జాగీరు)

### లోకల్ ఫండు పాఠశాలకై యత్నము

(ఒ.వి) ౨౬-౩ ౫౦

ఈజాగీరు భువనగిరితాలూకాలో చేరియున్నది. శ్రీ॥ శ్రీ॥ నవ్వాబు సైదుద్దౌలాగారిది, కొంతకాలమునుండి కోర్టుఆఫ్ వార్డ్సులోవుండెను. ఇప్రభుత్వవారు ౧౩౫౦ ఫ. లో ఖాల్సాజిల్లాలలోచేర్చుకున్నారు. ఇక్కడిగ్రామసంఖ్యను మారు ౬౦౦ జనసంఖ్య ౨౦౯౦ ఇక్కడలోగా ఒక పాఠశాల అంజుమన్‌యిస్లామియా అనునది ఉండెను, ఇప్పుడు ఈగ్రామముజిల్లాలలో చేరినదిగావున యిక్కడిలోకల్ ఫండు ఆదాయము నుబట్టి ఒకపాఠశాలకావలయునని దరఖాస్తునంపిరి. కాని ఫలితము యింతవరకు తేలలేదు.

**టప్పా**

ఇక్కడ రెండుసంవత్సరములనుంచి ఒకటప్పా పరీక్షార్థము తాత్కాలికముగా ప్రజలసహాయమువలనయేర్పరచినారు. నెల ౧కి ౨౦ రూపాయల ఆదాయముగలదు. అప్పటికైన సర్కారువారు నెలఆదాయము తక్కువవున్నదని దనువతు దాఖల్ చేయవలయునని లేనియెడల టప్పాఖాన రద్దుచేసెదమని అనుచున్నారు.

ఈగ్రామమున తూర్పుసరిహద్దుపై శ్రీనరసింహస్వామిగట్టుగలదు ఆగట్టుపై శ్రీనరసింహస్వామిఆలయముగలదు. ప్రతిసంవత్సరము మార్గశి ౧ మొదలుకొని పుష్య శు ౧౫ వరకు ప్రతిశనివారము, సోమవారము ఉత్సవముజరుగగలదు. పైవారములలో అనేకజనులు చుట్టుప్రక్కల వారలువచ్చి స్వామివారినిదర్శించి ప్రసాదములుపుచ్చుకొనిపోగలరు. వచ్చినజనులు తండోపతండములుగా మేకలు, గొర్రెలు, కోళ్ళు, మొదలగువానిని బలి సమర్పింతురు, జంతువులరక్తము ప్రవహింపజేయుబడును. జీవరక్షకప్రచారకమండలివారు ప్రబోధముకల్పించిపోగలరని మాప్రార్థన.

**విచిత్రము**

ఈగట్టుపై నొకకొలను గలదు. అందులోవిచిత్రమైనచేపలు యెర్రనివి, పొడుగైనవిగలవు, వాటికొరలు అరఅంగుళములుగలవిగా వున్నవి. వాటినిపట్టుకొనితినువారు సెత్తురుకక్కి చత్తురని వాడుక.

## నిర్మల

### యుద్ధనిధి ప్రదానికై నాటక ప్రదర్శనము

యుద్ధనిధి సహాయమునకుగాను మహారాజశ్రీ నిజాంప్రభుత్వపు రైల్వేవారిచే నియమింపబడిన ప్రకారము నాటకప్రదర్శనములు ముఖ్యపట్టణములందు జరుపుచువచ్చుచున్న "ఆంధ్రమిత్రమండలి"యను నాటకసమాజము గతశనివారం అనగా ౨౫తబహుమునాడు యిక్కడికిగూడ (నిర్మలకు)విచ్చేసి చింతామణియను నాటకమును యిక్కడిరైల్వేవారి ఆధిపత్యమున ప్రదర్శించి యిక్కడిపౌరుల కంతులేని ఆనందమును కలగచేసినవి.

ఇందుపాల్గొన్న నటీనటులు పూర్తిగా నాటకకళోపాసకులు కాకపోయినను, బహునేర్పుగా తమతమపాత్రలను పోషించి మనోహర నటనాకౌశలమునుచూపి నాటకరంగమున రక్తికట్టించిరి, ముఖ్యముగా బిల్వమంగళుని పాత్రనుధరించిన శ్రీ యస్.వి. శాస్త్రిగారు చింతామణి, రాధపాత్రలనుధరించిన మిస్.డి.వి. రత్నం.మిస్, అన్నపూర్ణగార్లు తమనుంచి కళానైపుణ్యమును, సంగీతవిద్యనుచూపి ప్రేక్షకుల నానందపరచిరి.

సుబ్బిసెట్టి, శ్రీహరిపాత్రలను ధరించిన ఏ వేంకటరావు, జీ.వి. స్వామిగార్లు తమ హాస్యముచే ప్రజలను పొట్టచెక్కలగునవ్వించిరి.

నాటకసమాజమువారికి తగినసౌకర్యములు సహాయమునొసగూర్చి నాటకప్రదర్శనమును జయప్రదముగాచేయుటలో పాటుపడిన యిక్కడి రైల్వేఉద్యోగస్థులు శ్రీ ఘంటులు వేంకటేశ్వరరావు, వ్యాసరావుగార్లు ప్రశంసార్హులు ఇక్కడి దువ్వముతాలుకదారుగారైన సయ్యద్ ఖలీముల్లాఖాదిరీగారు, నిర్మాణశాఖ మహసబ్ గారైన సి.వి. స్వామిగారు ఆర్థికవిషయములలో నాటకప్రదర్శనమునకు సహాయభూతులైరి.

కే. యల్. నరసింహారావు.

---

### ముదురాజకులము

ముదురాజవంశమహాశయులారా,

ముదురాజవంశము యెప్పటినుండి మొదలయినది, దీనికి"ముదురాజు"అనునామము వచ్చుటకుకారణము, ముత్తురాస తెనుగు, కోలియను పర్యాయపదములు దీనికియేకారణమువలన గలిగినవి. నాకువిస్తరముగా తెలుపుటకై ప్రార్థించుచున్నాడను"

ఇట్లు
కె. నారాయణ
ముదిరాజ్.
సికింద్రాబాదు[దక్కన్]
౩౧-౧౨-౪౦

## డాకూరు

(జోగీపేట తాలూకా)

### ఆర్యసమాజప్రచారము

(ఒ.వి) ౨౬-౩-౫౦

నేడిక్కడ సచ్చిదానంద గ్రంథాలయములో శ్రీమాన్ బుచ్చిరెడ్డిగారి అధ్యక్షతనసభ జరిగినది. ఒకవందమందిజనులువచ్చియుండిరి. శ్రీమాన్ నారాయణరెడ్డిగారు బ్రహ్మచర్యమును గురించి ఉపన్యసించినతర్వాత శ్రీమాన్ పండిత జయదేవు (సిద్ధాంతరత్న) గారు ఇపుడుమన స్త్రీలు సంతానమునకై వృక్షములకు గట్టులకు మొక్కి సంతానము కోరుచున్నారనియు, మనకు కావలసినకోరికలు ఏకేశ్వరుని ప్రార్థనతో సాధించుకొనవచ్చుననియుచెప్పిరి. శ్రీమాన్ ముదల్కర్ గోవిందరావుగారు ధర్మమునకై మహనీయుల ప్రాణములనువదలియున్నారనియు, మనము ధనాశచే ధర్మము వదలియున్నామనియు. ఉపన్యసించిరి. అగ్రాసనులవారికడపటి వినుర్యతో సభసమాప్తమయ్యెను.

## ఖమ్మంమెట్టు

### విషాదము

౨౬-౧-౧౯౪౦ న సాయంత్రం ౭గం టలకు ఇక్కడయువజనసంఘసభ్యులు సమావేశమై, యువకసోదరుడును, ప్రసిద్ధనటకుడునగు శ్రీమాన్ గంటికృష్ణమూర్తి గారి ఆకస్మికమరణమునకు తమవిచారమును తెలియుచు వారిఆత్మశాంతినిగోరిరి. ఖమ్మంమెట్టు ఉత్సాహవంతుడగు యువకునికోల్పోయినది.

ఇట్లు
పబ్బరాజు రంగ,
కార్యదర్శి

## మహబూబునగరము

ఆంధ్ర మహా సభాధ్యక్షులకు సన్మానము

ఆంధ్ర గ్రంథాలయాలయభివృద్ధికై ఒక ఉపసంఘపు ఏర్పాట్లు

(స్వ.వి.) ౨౭-౧౨-౧౯౪౦.

నేడుఉదయము ౯గం.లకు ఇచ్చటికి శ్రీ మందుముల రామచంద్ర రావు(ఆంధ్రమహాసభాధ్యక్షుడు)గారును, శ్రీ చిక్కెపల్లి రామచంద్ర రావు (స్థాయిసంఘకార్యదర్శి)గారును, ఈ జిల్లాసంఘాధ్యక్షులగు పి. హనుమంతరావుకీలుగారును దయచేసిరి. వారలు శ్రీ యం. నారాయణ రావువకీలుగారితో సహా దేవరకదిరకు సాయంత్రము ౪ గంటలకువెళ్ళి రాత్రి౭గంటలకు శ్రీ బాలసరస్వతీ ఆంధ్రగ్రంథాలయమునకు వచ్చిరి. గ్రంథాలయములో వీరిరాకకై పలువురువేచి యుండిరి.

శ్రీ యం. నారాయణరావుగారు కోటకొండశిద్ధిలింగప్పగారిని అధ్యక్షునిగా ఎన్నుకొనిరి. ఏగూరుచినప్పగారుబలపరచిరి. వారు అధ్యక్షపదవినలంకరించిరి.

ఆంధ్రమహాసభాధ్యక్షునకు ఏ. చన్నకేశవులుగారు పూలమాలవేసిరి. గ్రంథాలయసహాయకార్యదర్శిగారగు శ్రీ నందగిరి వెంకటరావుగారు సన్మానపత్రమునుచదివి శ్రీ వారికి సమర్పించిరి. శ్రీ ఏ. చన్నకేశవులుగారు స్వాగతపద్యమునుచదివి సన్మానపంచరత్నములసమర్పించిరి.

ఆంధ్రమహాసభాధ్యక్షులవారు సన్మాన పత్రమునుస్వీకరించుచు ఈ క్రిందిరీతిగా యుపన్యసించిరి:—

"ఈఆంధ్రసభ ఆరంభింపబడుటకు,పూర్వము నుండి గ్రంథాలయములయొక్క క్రమయేయని గర్వముతో చెప్పుచున్నాను. గ్రంథపఠనము వల్లనేఆంధ్రభాష, ఆంధ్రదేశాభిమానము గల్గచ్చును. ఈఆంధ్రగ్రంథాలయముల యభివృద్ధికై తగుపాటుపడుటకు ఆంధ్రసభలో ఒక ఉపసంఘమును ఏర్పాటుచేయవలయునని వామిత్రులుసెలవిచ్చినారు. ఈసమస్యను కార్యకారిణి సభలోపెట్టి తీర్మానముచేయించు ఏర్పాటుచేయగలను.

"ఈగ్రంథాలయముస్థాపించి ౧౩ సంవత్సరములు గావచ్చెను. మరియు నిది మధ్యకొన్ని సంవత్సరములు అజ్ఞాతవాసములోనున్నట్లు తెలిసినది. మరల తర్వాత ౧౩౪౭ఫ.లో పునరుద్ధరింపబడి ఇంతకొద్దికాలములోనే ౫౦౦ వరకు ఆంధ్ర, ఆంగ్ల, ఉర్దు,హిందీ, కన్నడపత్రికలతో ౫౦౦ వరకు గ్రంథములతో విరాజిల్లుచు ప్రతిరోజు ౩౦ పాఠకులవరకు వచ్చుచుండుటచూచి చాలాసంతసము గల్గెను. ఈరీతిగ నేముందును కూడా చాలాయభివృద్ధిగాంచగలదని నమ్ముచున్నాను.

రెండవసంతోషవార్తయేమనగా ఈ గ్రంథాలయమునకు పర్కాలమువారు నూతన సౌధమునకుగాను ఉచితభూమినిచ్చినారు. దాని పటము కూడతయారైనది. స్థానిక నాయకులు కొద్ది శ్రమనహించి సంస్థానాధీశులతో, మక్తేదారులతో విరాళములుగ్రహించి తొందరగా సౌధనిర్మాణము చేసినబాగుండును ఈజిల్లాలో గొప్ప గొప్పసంస్థానములుగలవు. కావున సౌధనిర్మాణమవుటకు చాలాకాలమేమియుపట్టదు. ఇట్టి సౌకర్యములుఇతరజిల్లాలలోలేవు స్థానిక నాయకులు త్వరగా పాటుపడగలరనినమ్ముచున్నాను"

కే. శే. రామచంద్ర శేట్

నిన్నరాత్రి ౮ గంటలకు మార్వాడీ రామచంద్రశేటుగారు కాలధర్మమొందిరి. వీరుధనవంతులేకాక మంచియోగాభ్యాసపరులు. బీదసాదలకు అన్నదానముచేయువారు సత్సంఘసేవకుడు, ఎల్లప్పుడు హరికీర్తనచేయునట్టి భక్తిపరుడు ఈగ్రామములోఅచ్చటచ్చట భజనసమాజములు ఏర్పాటుచేసిన మహనీయుడు. ఈ తేనిశవమును నేడుదయము ౧౦ గం. లకు శ్రీరామభక్తసమాజమువారు ఊరేగింపుమ శ్మశానమునకు తీసికొనివెళ్ళిరి. దహన సంస్కారములు ౧౨ గంటలకు జరుపబడెను.

ఈ స్మాసుగంజ్ కొత్తబజారు అంగడులన్నియు వారికిసానుభూతి తెలుపుచు మూసివేయబడెను. వారిఆత్మకు శాంతిగల్గుటకై దైవమును ప్రార్థించిరి.

మలేరియా

అమరబాద గ్రామం వాసులు మలేరియాజ్వరముతో బాధపడుచున్నారు. ప్రతిరోజు రెండు మూడు కేసులగుచున్నవి. ఇచ్చట ప్రభుత్వదవాఖానలేదు. శ్రీ రామాచారి వైద్యులవారు కొంతసేవజేయుచున్నట్లు తెలియుచున్నది. చలిబాధచాలావున్నది. రాత్రులందుమంచుకురియుచున్నది.

## వరంగల్లు

గీతోపన్యాసము

(ఒకవిలేఖరి) ౨౬-౧౨-౧౯౪౦.

ఇక్కడ ఒకనెలనుండి శ్రీ వరవర నరసింహారావుగారి ధర్మశాలలో జగిత్యాలతాలూకా కోరుట్లగ్రామకాపురస్థులగు రాజయోగి ఉ॥ వే॥ నేపాని నరసింహాచార్యులు స్వామివారు భగవద్గీతా కాలక్షేపము చేయుచున్నారు. వీరుగీతోపదేశములు ద్వైత, అద్వైత విశిష్టాద్వైతరూపమైన హిందుమతానికేగాక మహమ్మదీయ క్రైస్తవమతములకుకూడ అనుచరణీయమని చెప్పుచున్నారు.

ఆర్యప్రచారకుని రాక

కార్యనిర్వాహక వర్గపుఏర్పాట్లు

శ్రీ సాంబమూర్తి (ఆర్యప్రచారకుడు) మహబూబునగరపట్టణానికివచ్చి నాలుగైదురోజులు కావచ్చెను. బహమన్ ౨౭వతేది రాత్రి శ్రీ కోటకొండసిద్ధిలింగప్పగారియింటివద్ద అందరుసమావేశమై శ్రీ వారిని అధ్యక్షునిగా శ్రీ కిషన్ సింగును ఉపాధ్యక్షునిగా, ఏగూరుచిన్నప్పగారిని కార్యదర్శిగా, బుచ్చయ్యగారిని సహాయకార్యదర్శిగా ఎన్నుకొనిరి. కొందరుసభ్యులుగా చేరనున్నారు. శ్రీ విక్రమనామసం॥ పుష్యశు ౧౦ లు సోమవారమురోజున సమాజస్థాపన చేసి, హిందీజనులకు విద్యార్థులను సమకూర్పు ఏర్పాట్లు గావింపబడినవి.

---



# గోలకొండ గ్రంథాలయము

## హిందువుల పండుగలు

గ్రంథకర్త: — సురవరంప్రతాపరెడ్డిగారు. వెల ౧-౦-౦ దొరకుస్థలము గోలకొండ పత్రిక, సుల్తాన్ బజారు, హై. ద.

హైందవజాతీయతకును ఎటువంటికట్టుబాట్లములతో కూడినఆధ్యాత్మికప్రపంచమో ఈ గ్రంథమునందు వెల్లడించబడినది. గ్రంథకర్తయొక్క విమర్శనాకౌశల్యము "జన్మాష్టమి, మహాశివరాత్రి" మొదలగు మంచిఘట్టములందు చూడనగును. యిందుకొన్ని పండుగలు, వ్రతములును, ఆంధ్రదేశమున అభ్యాసములేనివికలవు. శాస్త్ర చర్చాదినివేశతకలిగివిమర్శింపబడిన ప్రతాపరెడ్డి యోగ్యతగల సమగ్రగ్రంథము. ఆంధ్రమున నేగాక యితర భాషలయందును యింతవరకు లేదనియే చెప్పవలయును. యిదివరకెన్నియో పర్యాయములుసమర్థులగు చారిత్రక పరిశోధకుల చేసంపూర్ణముగా ఈగ్రంథమువిమర్శింపబడి మెరుగుగాంచినది-తిరిగివిమర్శించుట- సూర్యునిదివ్వెతో చూపించుట- గ్రంథము మొత్తముమీద ఏబదినాలుగుపండుగల చర్చగలదు. యిందులో వారములు మొదలగు కొన్నివ్రతములును, కొన్ని ప్రత్యేకభాగములవారనుసరించు సాధారణవిహితగుర్తులునుగలవు, అన్నింటినిమొత్తముమీద పండుగలగానే గుదిగూర్చి "వ్రతమనగా నేమి?" యను ప్రాతిపదికతో సమన్వయించినారు శ్రీ రెడ్డిగారు. యిదియొకనూతన వైమర్శికభంగిమయనక తప్పదు.

నిరాడంబరజీవయాత్రయే ప్రధానోద్దేశ్యముగాగల శ్రీ ప్రతాపరెడ్డిగారు తమ విద్వావైదుష్యమును వెల్లడిచేయుటకు గాకున్నను ఆంధ్రవిజ్ఞానౌన్నత్యమును, ఆంధ్రధార్మికభావమును, యితరులెరుగుటకుగాను "హిందువుల పండుగలను" కనీసము హిందీ యింగ్లీషుభాషలయందైనననువదించి ప్రకటనచేయింప గోరుచున్నాను. యిందుకు యశోహితచింతకులగు మిత్రులు వారికి ప్రోత్సహింపక మానరనినమ్మెదను. అధికారభావమున గాకున్నను ఆదరపూర్వకము... శ్రీ కొత్వాల్ వెంకటరామారెడ్డిగారికార్యక్రమమున ప్రతాపరెడ్డిగారిని మంత్రోపదేశమొసంగగలరని ఆశించుచున్నాను.

పండిత రామానుజస్వామి,

శతావధాని, ఆయుర్వేదాచార్య

## కేనోపనిషత్తు

వ్యాఖ్యాత. ముమ్మనేని లక్ష్మీనారాయణ చౌదరిగారు పుటలు ౨౨౦ వెల ౫ అణాలు. ప్రకాశకులు. భాషాసంజీవినీ గ్రంథమండలి-అమృతలూరు, గుంటూరు-జిల్లా.

సుప్రసిద్ధ వైదికోపనిషత్తులలోచేరి ఆచార్యత్రయ భాష్యగౌరవమునుపొంది సర్వహిందువులకును పూజనీయమైన ఈఉపనిషత్తు "కేనేషితం" అని కేనశబ్దముతో ప్రారంభమైనందున దీనికి కేనోపనిషత్తుఅని ప్రసిద్ధికలిగెను. దీనికి ముమ్మనేని లక్ష్మీనారాయణ చౌదరిగారు ప్రతిపదార్థమును తాత్పర్యమును విశేషార్థమును బాగుగా సులభగ్రాహ్యముగా నుండునట్లు తెనుగులో వ్రాసియున్నారు. మూలశ్లోకములను ఇచ్చియున్నారు. వ్యాఖ్యానపద్ధతి ఇంచుక శాంకరమతమునకు భిన్నముగా కనబడుచున్నది. ఆర్యసమాజముపద్ధతిపై వ్రాయబడినది. అట్లున్నను మంచి నేర్పుతోను పాండిత్యముతోను ప్రతిభతోనుకూడిన వ్యాఖ్యగా నున్నది.

## కమ్మవారి చరిత్రము ౨వ భాగము

కర్త కొత్త భావయ్య చౌదరిగారు పుటలు ౨౯౦. వెల ౧-౪-౦ దొరకుస్థలం భావయ్య చౌదరిగారు. సంగంజాగర్లమూడి పోస్టు, గుంటూరు జిల్లా.

ఇదివరలో ప్రథమభాగమునుగురించి అభిప్రాయమీపత్రికలో ఇయ్యబడియుండెను. ఇప్పుడు రెండవభాగమందినది. ఇందు క్రీ.శ. ౧౦౦౦ మొదలుకొని ౧౬౫౦వరకుగల కమ్మవీరులచరిత్ర కలదు. ఇందు వెలగాలు తెలంగాణాలోని కాపులకీపేరుకలిగినదను విషయమును హైహయులు మున్నూరుకాపులను వివాహమాడినట్లును చౌదరిగారు సూచించినారు, మున్నూరుకాపులను గురించి ద్వాత్రింశత్సాలభంజికా కథలను తెనుగు ప్రబంధములో వేరువిధముగా నున్నది. మరియు ద్రాక్షారామములోని పూర్వశాసనాలలో పేర్కొనబడిన పెదమున్నూరు, చినమున్నూరుగుంపు. ఆసుపదాల కేమిఅర్థము వీటిసమన్వయమునూడాచేసిన బాగుండును. మేము మొదటిభాగముపై చేసినవిమర్శలో "గొల్లతల్లుల బిడ్డల వనిపతులు"అను పదముల సమన్వయముకోరియుంటిమి. దీనిపై గ్రంథకర్తగారు కీ॥ శే॥ వెల్లాల సదాశివశాస్త్రిగారిసవరణ "అల్లసవతితల్లుల బిడ్డలవనిపతులు"అను పాఠమునిచ్చినారు, ఇదియేసరియైనదని స్పష్టము. పూర్వపాఠము యతిభంగముచేత దూష్యమగును. ప్రామాణికకవియగు వల్లభామాత్యుడు క్రీడాభిరామములో అట్టితప్పును చేయజాలడు. ఈగ్రంథములో ప్రాచీన కమ్మవీరుల విషయాలు చాలావ్రాసినారు. ప్రారంభదశలో ఇట్టివిపులతకు చాలఅవసరముకూడా కలదు. మేమిదివరలో కమ్మలు రెడ్లపూర్వ పేకశాఖవారేఅని అభిప్రాయమిచ్చియుంటిమి, ఈ భాగములో మాఅభిప్రాయాన్ని గ్రంథకర్తగారు సమర్థించినారు. ఇందుచాలా అమూల్యమైన విషయాలున్నవి. ఆయావీరులపై చెప్పిన చాటువులనుకూడ విపులముగా ఉదహరించినారు. అవిచాలాఆనందదాయకములుగాను సారస్వతప్రియులకు ఉపయోగకరములైనవిగాను ఉన్నవి. గ్రంథకర్తగారికృషిని అభినందించుచున్నాము.

## సరిహద్దురాష్ట్ర సత్యాగ్రహము

పెషావరు, డిసెంబరు ౨౧

సరిహద్దురాష్ట్రసత్యాగ్రహం మొదలుపెట్టి నేటికి ఒకవారంఅయినది. డాక్టరుఖాన్ సాహెబు గారు యుద్ధప్రతికూల కేకలువేయుచు నేడు ౧౨ గ్రామాలకు నడచివెళ్లిరి. వారితో అబ్దుల్ ఖయూం యం.యల్.ఏ (సెంట్రల్) మియాన్ జాఫర్ షా, అబ్దుర్ రహమాన్ యం.యల్.ఏ గారలుకూడానుండిరి, పూర్వవిద్యామంత్రి ఖాజిఅతాఉల్లాగారుకూడా పెషావరుజిల్లాలోయిరువురు అసెంబ్లీసభ్యులును, బన్నూజిల్లాలో యిరువురును యుద్ధవ్యతిరేక కేకలువేసిసత్యాగ్రహంచేసిరి.

పెషావరు, డిసెంబరు ౨౨

డా॥ ఖాన్‌సాహెబుగారు మియాన్ జఫర్ షా యం.యల్.ఏ గారితోకలిసి నేడుఅనేక గ్రామాలవు సత్యాగ్రహంచేస్తూవెళ్ళిరి. వారుఘటం దూనుండి కాలినడకను బయలుదేరి సాయంకాలమునకు ౧౨ మైళ్ళువెళ్లి బెసుద్‌గ్రామము చేరిరి. అక్కడనుండి ఖాన్‌సాహెబుగారు మోటారులో పెషావరకువెళ్లిరి.

పెషావరు, డిసెంబరు ౨౩

సరిహద్దురాష్ట్రపూర్వ విద్యామంత్రి ఖాజిఅతావుల్లాగారిట్లు తెలుపుచున్నారు.

నేను అటార్నబీలో సత్యాగ్రహంచేయుచు చేసినఉపన్యాసం ముగించినతోడనే పోలీసు సబ్ ఇన్‌స్పెక్టరు నావద్దకువచ్చి నేనుఅరెస్టులో నున్నటుల నెంచవలెనని చెప్పెను, నన్ను అరెస్టుచేయుటకు తనవద్దఏదేనివారంటుఉన్నదా యని నేను ప్రశ్నింపగాజేబులోనున్నదని అతనుపల్కెను. అపైనినేను గ్రామంనుండి గాందులబ్రింకరోడ్డువరకు అతనితోనడిచితిని అక్కడినుండి నన్ను లారీలోపిలుచుకొనిపోయి నగర సరిహద్దు వద్దన న్నాతడు వదలివేసెను.

## ఆంధ్ర సత్యాగ్రహులు

ఆంధ్రరాష్ట్రకాంగ్రెసు సంఘసంయుక్తకార్యదర్శిగానున్న శ్రీ॥నీలం సంజీవరెడ్డిగారు డిసంబరు ౨౧తేది సాయంకాలము ౭గం॥లకు తమ గ్రామమగు ఇల్లూరునందు సత్యాగ్రహమొనర్చి యుద్ధసహాయనిరోధక వాక్యము లుచ్చరి౦చిరి. తక్షణమే అనంతపురంపోలీసుడిప్యూటీ సూపరిం టెండెంటుగారు రెడ్డిగారిని అరెస్టుచేసి తమమోటారులో అనంతపురమునకు తీసుకొనివెళ్ళిరి. రాత్రితొమ్మిదిగంటలకే డిప్యూటీ మేజిస్ట్రేటుగారి ఎదుట విచారణజరిగెను.

వారికి ఊ నెలలకఠినశిక్షయు, ౪౦౦ రూ॥ జుర్మానాయు, విధించి "బీ"తరగతి సిఫార్సు చేయబడెను.

ఆ. భా. కాంగ్రెసుపరిషత్సభ్యులగు శ్రీ వెన్నెలకంటి రాఘవయ్యగారు ౨౨వ తేదిసత్యాగ్రహంచేయగా, వారిని అరెస్టుచేసి రిమాండులో నుంచిరి. ౨౩వ తేదిడిస్ట్రిక్టు మేజిస్ట్రేటుగారు విచారించి ఆరుమాసముల కఠినశిక్షవిధించి "బీ"క్లాసునిచ్చిరి.

## అన్నదానసహాయ విజ్ఞప్తి

మహాశివరాత్రి మహోత్సవకాలమందు మాఘ బ॥ ౭ మీ మొదలు ౧౪వరకు బీదలకు, సాధువులకు, చెంచులకు అన్నదానముజరుపబడును గాన భక్తజనులు యథాశక్తివిరాళముల నొసగువలయునని కోరు చున్నారు.

శ్రీ బసవయ్యస్వామిగారు, ప్రెసిడెంటు, శ్రీశైలం, ఆత్మకూరు (పోస్టు), కర్నూలు జిల్లా.

## దేశరక్షణనిబంధనలక్రింద శిక్షలు

లాహోరులో డిసంబరు ౨౧వతేదిన పంజాబు కాంగ్రెసుసోషలిస్టుపార్టీ కార్యాలయ కార్యదర్శి శ్రీ మెహ్రాజ్‌ద్దీన్ గారికి ఊ నెలలకఠినశిక్ష యు, ౨౦౦రూ॥ జుర్మానా, దానిని చెల్లించనియెడల మరి మూడు నెలలు శిక్ష విధింపబడెను.

ముల్తాన్‌జిల్లా కాంగ్రెసుఅధ్యక్షుడు. అఖిలభారత కాంగ్రెసుపరిషత్తుసభ్యుడును నగు చౌదరీ ఇతావుల్లాగారు డిసంబరు ౨౧వ తేదిన అరెస్టుచేయబడిరి. వారిని ముల్తాను మేజిస్ట్రేటుఎదుటపెట్టగా జనవరి ౪వతేదివరకు వారిని మేజిస్ట్రేటు రిమాండులోనుంచెను

లక్నోనగరమందలి సివిలుఇంజనీరు స్కూలు విద్యార్థి సర్దార్ యశ్వంత్‌సింగు అనునతడు లక్నో పోలీసులచే మోతీనగరులోఅతనియింటిలో అరెస్టుచేయబడెను

అమృతసరుపట్టణంలో శ్రీ లక్ష్మీనారాయణ (మునిసిపలుకమిషనరు), శ్రీ యుతచందన్‌లాల్‌జా, శ్రీ యుత నారాయణదాస్‌భిన్నా, శ్రీ చరణ్‌దాస్ అనునలుగురు ౨౨వతేదిరాత్రి అరెస్టు చేయబడిరి. వారందరు తలా రూ. ౫౦౦౦ పూచీకత్తుతో బెయిలుమీదవదలివేయబడిరి.

## చైనాలోచియాంగ్ కేషేక్ గారి బలము

జపానుప్రభుత్వ యుద్ధశాఖలో ప్రకటనశాఖ ప్రధానాధికారియగు కల్నల్‌మాబుట్సీ గారు చైనాలో తిరిగి జపానుకు ఇటీవలనేచేరి ఒకపత్రికలో వ్రాసినవ్యాసములో- ఇప్పట్లో చైనాలో మార్షల్ చియాంగు కేషేకుగారి అధికారము అంతమొందేటట్లు లేదనినారు. ఎందుకనగా షేకుగారికి బలపరముచైనీయుల దేశభక్తి అసాధారణమైనది. జర్మనీ.ఇటలీతోకలసి జపానుచేసికొన్న ఒడంబడికవల్ల జపానుస్థితిబాగుపడునని ఆ నేనుతలచినానుగాని, చైనా ప్రభుత్వస్థితియే దానివల్లబాగుపడునని ఆవ్యాసములో చెప్పబడినది. "రెడ్‌స్టార్"అను రష్యాపత్రిక గతసంవత్సరంలో బర్మారోడ్డుపై నిరోధముతొలగించుటవల్లను, చైనాలోని దక్షిణ రాష్ట్రములలో యుద్ధపరిశ్రమలు వృద్ధియగుటవల్లను చైనాయొక్క యుద్ధశక్తి హెచ్చినదని అభిప్రాయమిచ్చినది.

## జపానుయొక్క విధానము

జపానుప్రభుత్వమువారి ప్రచురణశాఖమంత్రియగు డాక్టర్ ఐతోగారు డిసంబరు౨౦వ తేదిన ఒక స్వీడనుపత్రికవిలేఖరితో సంభాషించుచు, జపానుస్థితికి దెబ్బతగిలించబడనంతవరకు పసిఫిక్ సముద్రంలో ఇప్పటిస్థితిని జపాను ఇంకను ఏక్కువఅన్యాయము చేయదని చెప్పిరి. జపాను విధానము ఇతరదేశములతో విరోధభావములేకుండ జర్మనీ ఇటలీలతోకలిసియుండు పద్ధతియనియు! జపాను ఆసలుఉండుటకు ఎంతమాత్రము అవసరమో అంతేకోరికలుకోరదనియు వారుచెప్పిరి. ప్రతిదేశము తనతనప్రాంతములో నిరాటంకముగ తనపనిసాగించుకొనుపద్ధతికి అమెరికా, బ్రిటనులను జపాను ఒప్పించదలచినదనియు, ఈపద్ధతిప్రకారము అంతర్జాతీయ న్యాయమునననుసరించి తూర్పుప్రాంతములో వ్యవస్థను పునర్నిర్మించుటకై జపాను యత్నించునని యు వారు చెప్పిరి.

## శిక్కుగురుబోధలకు మహాత్ముని అర్థము

గాంధిమహాత్ముడు పంజాబురాష్ట్ర కాంగ్రెసుసంఘకార్యవర్గసభ్యుడగు మియానిగురుముఖ్ గారికి వ్రాసినఒకలేఖలో "శిక్కుగురువుల బోధలు అహింసను కర్తవ్యముగా తెలుపుచున్నవని వ్రాసినారు.

"గురుగ్రంథసాహెబ్ ప్రపంచ దివ్యజ్ఞాన గ్రంథములలో నొకటియని నాఅభిప్రాయము. ఇస్లాం, క్రైస్తవమతము, జోరాస్టర్ మతము, జూడాయిజం, హిందూమతము—వీటిబోధలను నా ఓపికకొలది అనుసరించుచున్నట్టే గురుగ్రంథ సాహెబ్ బోధలనుకూడ అనుసరించుచున్నానని యే నాభావన. అహింసవిషయంలో ఆబోధలపరమార్థము అహింసయేవిధియనునదే కాని అధైర్యంతోలొంగుటయా, లేక కత్తిదూయుటయా అనే ప్రశ్నవచ్చినపుడుమాత్రమే హింసను సహించుట చెప్పబడినది." అనిమహాత్ముడు తెల్పినాడు.

## భాగ్యనగర విశ్వబ్రాహ్మణ ద్వితీయసంస్కరణవివాహము

స్వస్తిశ్రీ విక్రమనామసంవత్సర మార్గశిర బ॥ ౧౨॥దివి ౨౬-౧౨-౧౯౪౦ గురువారంనాడు బ్రహ్మశ్రీ యస్.యెల్లయ్య రిటైర్డుసబింజనీయర్ గారి అధిపత్యమున బ్ర॥వల్లభరామాచారిగారి జేష్ఠపుత్రుండగు చి॥ బ్రహ్మయ్యాచారిగారికిని సూర్యాపేటవాస్తవ్యులైన కీ॥శే॥రథంకోటయ్యగారికనిష్టపుత్రికయగు చి॥సౌ॥గౌరమాంబకునుసికింద్రాబాద కుమ్మరిగూడెంలో బ్ర॥శ్రీ ద్రోణారామస్వామిగారిగృహంబున అతివైభవముగా వివాహముజరిగెను. ఈవివాహమున డాక్టర్.శర్మగారును శ్రీలింగపుశాస్త్రిగారును సంస్కరణసంఘకార్యదర్శులైన తాడూరిలక్ష్మణాచార్యులుగారును ఈవివాహములగూర్చి యుపన్యసించుచు మరియు కొందరు సనాతనులమనుకొనువారు ఈ స్త్రీభావముచే ; ప్రౌఢవివాహసమస్యనుప్రభుత్వ శాసనమున తొలగించినందుకు కడువిచారము తెలిబుచ్చుచు చెప్పిరి.



ని. ఘ. వ. నిజాంస్టేటు రైల్వే

## నోటీసు

ఇందుమూలముగా అందరికి తెలియజేయుట ఏమనగా, 1941 ఫిబ్రవరినెల నుండి ప్రతినెల రైల్వే టైంటేబుల్ ప్రచురించుట ఆపివేయబడును. ఇకముందు ఏప్రెల్ మరియు అక్టోబరు నెలలో టైంటేబుల్ మరియు గైడున్ను, జనవరి జులై నెలలో పాకెట్ టైంటేబులున్ను ప్రచురింపబడును.

బైఆర్డర్

